# పాండిచ్చేరి గీతాలు

## పన్నెండు



సుప్రసన్న




శ్రీ అరవింద కేంద్రము,
నర్సంపేట.

# పాండిచ్చేరి గీతాలు

## పన్నెండు



సుప్రసన్న

శ్రీ అరవింద కేంద్రము,
నర్సంపేట.

# PONDICHERRY GITALU PANNENDU
[Twelve Poems on Pondicherry]

by:
SUPRASANNA

Published by Sri Aurobindo Centre,
Narsampet, Warangal Dt.



Publication: 24th April 1975.

Price: One Rupee



Printed at:
Vijaya Press, Warangal-2.

# సంకల్పము

సత్, చిత్, ఆనంద స్వరూపమగు పరతత్త్వము జడప్రాణ మనోమయ క్షేత్రములలో క్రమక్రమముగా వికసించుట సృష్టి విలాసము. విజ్ఞానము ఇంక అవతరింపవలసి యున్నది. పూర్ణయోగ సాధనయే ఆ శుభావతరణమును త్వరితపరచగలదని శ్రీ అరవిందులు చాటి చెప్పిరి.

మానసిక స్థాయినుండి ఆధ్యాత్మికస్థాయికి అధిరోహించి, జీవితమును సమగ్రముగా బాహ్యాంభ్యంతర పరివర్తనమునకైన సాధనలో తొలి మెట్టుగా శ్రీ అరవింద కేంద్రము ది. 2-2-1975 నాడు ప్రారంభింపబడినది. శ్రీ అరవింద తత్వమునందు విష్ణాతులైన డాక్టర్ శ్రీ మన్ మోహన్ రెడ్డి కేంద్రమును ప్రారంభించినారు. మా మనః క్షేత్రములందు శ్రీ అరవిందతత్త్వ బీజావాపన గావించినారు. చిన్న గ్రంథాలయముకూడా ప్రారంభింపబడినది. మాతృశ్రీ దివ్య విభూతులను 21-2-1975 మాతృశ్రీ జయంతినాడు సర్దార్ శ్రీ సేవాసింగ్ మా కేంద్ర సాధకులకు వివరించిరి.

ప్రేమపూర్వకమైన మా ఆహ్వానమును సంగీకరించి, డాక్టర్ సుప్రసన్న కేంద్రమును సందర్శించినప్పుడు వారి "పాండిచ్చేరీ గీతాలు పన్నెండు" అన్న రచనను వివరించుచు ఉపన్యసించి, దాని తాత్త్వక కవితా సౌందర్యములను వెల్లడించినారు.

శ్రీ చదలవాడ కృష్ణారావు కోరికను పురస్కరించుకొని డాక్టరు సుప్రసన్న తమ ఆ కవితా గ్రంథమును మా కేంద్రము పక్షమున ప్రచురించుటకు అనుమతించిరి. వారికి కృతజ్ఞులము.

శైశవ దశయందే ఈ కేంద్రము సాహసోపేతమైన గ్రంథ ప్రచురణ కార్యమును విజయవంతముగా నిర్వహించి పాఠక లోకముయొక్క కర కమలములందు "పాండిచ్చేరీ గీతాలు పన్నెండు" అను కావ్యకుసుమమును అలంకరింపచేయగల్గుట శ్రీ జగన్మాత యొక్క కృపాకటాక్షమువలననే. శ్రీ అరవింద కేంద్రము భవిష్యత్తులో నిర్వహించనున్న కార్యక్రమములందు సహృదయుల సంపూర్ణ సహకారముండగలదని మా ఆకాంక్ష.

— శ్రీ అరవింద కేంద్రము, నర్సంపేట.

# భూమిక

భారతదేశ చరిత్రలో శ్రీ అరవిందుల ఆవిర్భావము ఒక మహత్తర సన్నివేశం. ఆదినించీ అధ్యాత్మ దర్శనములో మానవాళికి ఉత్తీర్ణకములైన వేదములను, ఉపనిషత్తులను, దర్శనములను, వేదాంత ప్రస్థానములను సమర్పించిన భారతదేశము, ఏదో ఒక దైవిక కారణంచేత పారతంత్ర్యమున క్రుగ్గి వేయేండ్ల అంధకారంలో మునిగిపోయి మరల జాగరణం పొందిన వేళలో ఉద్భవిల్లిన మహా పురుషుల పరంపరలో శ్రీ అరవిందులది విశిష్టమైన స్థానం.

శ్రీ అరవిందుల దర్శనం ఎంత హేతుబద్ధమయిందో అంత అనుభూతి దఘ్నమైంది. ఎంత సనాతనమైందో అంత అధునాతనమైంది. ఎంత వైదిక దర్శన వ్యాఖ్యానమో, అంతగా ఆధునికశాస్త్ర సమన్వయము కలది. పరాపర విద్యల వైరుధ్యం తొలగించినది. లోకజీవనం మిధ్య అనీ, అనిత్యమనీకాక అది అంతా ఈశ్వర చైతన్య విలాసముగా ప్రకటించింది.

శ్రీ అరవిందుల సాధన వైయక్తిక మోక్షసాధన పరమార్థంగా సాగిందికాదు. ఉన్నత భూమికలలోని దివ్య చైతన్యం ఇక్కడికి దిగిరావడానికీ, ఇంతదాకా సాగివచ్చిన జగచ్చైతన్యం ఉన్నత భూమికలకు అధిరోహించడానికీ ఉద్దేశించబడ్డది. జడప్రాణ దశలుదాటి మనోమయ దశలోనున్న మనం ఇంకా అధిరోహించే విజ్ఞానమయ భూమికను చేరేందుకు త్రోవను నిర్దేశించింది.

శ్రీ అరవిందులు వేదములకు కొత్త వ్యాఖ్యానం చేశారు. వేదములను కేవలము వరాపరములుగాక బ్రహ్మవిద్యాపరముగా సమన్వయించి, వేదర్షులు దర్శించిన అతిమనోభూమికలను నూతనముగా వివృతి చేశారు. యోగసాధనలో సాధించిన ఫలితాలను మహత్తరములైన గ్రంథాలుగా రచించి మానవావళికి దిగ్దర్శనం చేశారు. 'దివ్యజీవనము', 'యోగసమన్వయము',

'గీతా వ్యాసావళి' మొదలైనవి వారి తాత్త్విక గ్రంథాలు. ఆయన తన దర్శనాన్ని ఒక గొప్ప ఇతిహాసం ద్వారా కవితామయంగా చిత్రించారు. 'సావిత్రి ఒక గాథ-ఒక ప్రతీక' అనే పేరున అర్ధ శతాబ్దంపాటు ఈ మహేతిహాస రచన జరిగింది. అరవిందుల కవిత ఆంగ్లభాషకు మంత్రమహిత లక్షణాన్ని కలిగించింది. ఈ రచన శ్రీ అరవిందుల ఆధ్యాత్మ సాధనకు వివృతిగా, ఆయన దర్శనానికి దర్పణంగా రూపొందింది.

శ్రీ అరవిందులు పందొమ్మిదేండ్లదాక భారతీయ జీవన పద్ధతులలో ఏ మాత్రము పరిచయములేని పాశ్చాత్య విధానములలో పెంచబడ్డారు. అయినా ఆయన విద్యాభ్యాసం ముగించి. ఈ దేశానికి వచ్చేప్పటికి ఆయనకు భారత మాత తన సమగ్ర స్వరూపంతో సాక్షాత్కరించింది. ఆయనలో కలిగిన ఆర్తి వెంటనే ఆయనను గొప్ప స్వాతంత్ర్య విప్లవయోధునిగా తీర్చిదిద్దింది. ఆ సమరంలోనూ ఆయన కేవలం భౌతికమైన భారతదేశాన్నే ఆయన దేశమాతగా భావించలేదు. కాని కొంత కాలానికి ఈశ్వర సంకల్పం వలన ఆయన మానసికంగా పరిణతిని పొందారు. కారాగారంలో అనుభూతమైన దివ్యదర్శనం, ఈశ్వరాదేశం కారణంగా తాను నిర్వహించవలసిన ఉన్నతమైన మరొక కార్యంకోసం ఆయన పాండిచ్చేరీ చేరుకుని ఆశ్రమం నెలకొల్పారు. క్రమంగా ఆయన సాధనలో పరిపూర్ణతను పొందారు. క్రమక్రమంగా ఆ అనుభవాలను గ్రంథాలుగా రూపొందించారు. ఆయనకు సహాయంగా మాతృశ్రీ వచ్చి ఆశ్రమంలోచేరి చక్కగా ఆశ్రమం పరిపాలిస్తూ సాధకులకు స్వయంగా తానే మార్గాన్ని నిర్దేశిస్తూ వచ్చింది. శ్రీ అరవిందులు బాహ్యజగత్తుతో సంబంధాలు తగ్గించుకుని చివరి 24 సంవత్సరాలు ఏకాంతవాసం చేశారు. ఈ ఏకాంతవాసంలోని సాధన జగత్తులోనికి విజ్ఞానమయ భూమికను అవరోహింపజేసేందుకు చేసింది.

ఆధునిక భారతీయ చరిత్రలో అరవిందులదొక దివ్యమైన స్ఫూర్తి. ఒక మహత్తర విభూతి. భవిష్యన్మానవావళికి దేశికుడు. వారి ఈ వివేచన అపూర్వమైంది. భారతీయుల ధ్వని రససిద్ధాంతాలు ఎట్లా ప్రపంచ కవితా శాస్త్రంలో అపూర్వమైనవో, శ్రీ అరవిందుల యీ వివేచనమూ అంతటి

అపూర్వమైనదే. కవి ఒకానొక ఆధ్యాత్మిక అనుభూతి దశలో పలికినప్పుడు ఆతని రచన మంత్రస్థితిని పొందగలదని ఆయన భావించినారు.

ఆధునిక కాలంలో భారతీయుల ఆత్మను మేల్కొల్పి, జాతిని ఉజ్జీవింపజేసిన వారిలో శ్రీ అరవిందులు ప్రముఖులు. భారతజాతి మధ్యయుగాలలో సంకుచితమైన, స్వార్థపరమైన, అభ్యుదయ నిశ్శ్రేయసములకు విదూరమైన పద్ధతులను స్వాయత్తీకరించుకున్నది. వాని పరిధుల నుండి ఉత్తీర్ణం చేసి విశ్వమానవ పరంపరలో సముచితమైన స్థానాన్ని కల్పించిన వారాయన.

శ్రీ అరవిందులు యోగి, ద్రష్ట మాత్రమేకాక మహాకవి. ఆయన స్వభావములోనే ఆదినించీ ఈ తత్త్వము ఆయనను శుష్కవేదాంతము నుంచి పరిపూర్ణఅద్వైతదర్శనం వైపుకు కొనిపోయింది. కవితా రచనమేకాక ఆయన కవితాతత్త్వమును కూడా విపులముగా వ్యాఖ్యానము చేసినారు. విశ్వ మహాకవుల కవితలను విశ్లేషించి వారు ఏఏ చైతన్య సాయిలో నుండి తమతమ కావ్యాలను రచించినదీ విప్పి చెప్పినారు.

శ్రీ అరవిందుల సాధనామార్గం భౌగోళిక సరిహద్దులకు పరిమితం కాలేదు. అన్ని ఖండాలనించీ, అన్ని దేశాలనించీ జనులువచ్చి పాండిచ్చేరీలో చేరుకున్నారు. సాధకులు తమ జీవనంలో సామాన్య లౌకిక జీవనం గడుపుతూనే, అసాధారణంగా దివ్య లోకాలవైపు ఎదుగుతున్నారు. తమ సర్వచైతన్యాన్నీ— ఈశ్వరునికి సర్వ సమర్పణభావంవల్ల— దివ్య చైతన్యావతరణకు సంసిద్ధం చేస్తూవున్నారు. ఏవిధమైన పనియైనా ఈశ్వరారాధనమే. ఈ విధంగా ఆయన మార్గం దివ్యాదివ్య చైతన్యాలకు సంగమస్థలం అయింది. జీవనమంతా యోగమే.

శ్రీ అరవిందుల ఆశ్రమము ప్రాచీన ఆశ్రమములవలెకాక కొంత విలక్షణముగా నిర్వహింపబడుతూ వున్నది. మాతృశ్రీ ఒక అంతర్జాతీయ నగర నిర్మాణాన్ని కూడా 'ఆరోవిల్' పేర ప్రారంభించారు. విశిష్టమైన వాస్తుపద్ధతిలో ఈ నగర నిర్మాణం దేశదేశాల జనులను సమాకర్షిస్తూన్నది.

మాతృశ్రీ పార్థివశరీరాన్ని విడిచిపెట్టిన కొద్దిరోజులకే ఈ రచయిత జనవరి 1974లో నేను పాండిచ్చేరీ వెళ్లడం తటస్థించింది. అక్కడ గడిపిన ఒక రోజు అంతా ఒక కొత్త లోకంలో ఉన్నట్టు తోచింది. తిరిగివస్తూ ఆ అనుభవాలను నెమరువేస్తూ వుండగా ఈ రచనకు ఆరంభం జరిగింది. అయితే ఈ రచన జరిగింది మే నెలలో.

ఈ రచన అనుభూతి ప్రధానమైనది. అక్కడ ఆయా సన్నివేశాలు కలిగించిన ప్రేరణలు వ్యక్తీరింపబడ్డవి. పన్నెండు గీతాలు ఒక క్రమపద్ధతిలో యాత్రను సూచిస్తవి. లౌకికంగా ఈ యాత్రను సూచిస్తూనే అధ్యాత్మిక జీవయాత్రను కూడా స్ఫురింపజేయడం కద్దు.

ఈ అనుభూతి ఈ గీతాలవల్ల పాఠకులకు కొంతగానైనా కలిగినా ఈ రచయిత కృతార్థుడు.

ఇంకా తెలవారలేదు, చీకటితెర జారలేదు
రైలు ఆగింది, నిశ్శబ్దం మేల్కొన్నది.

మానస సరస్సులోకి దిగబోయే హంసలలా
పరిమళాలను విప్పుకోబోయే సంపంగి పూలలా
బిలబిలా దూకుతూ, గలగలా నవ్వుతూ
మేము—
మా సంఖ్య రెండు పదులు.

పలుచబడే ఆ చీకటిలో ఇరవై తారలు
నిశ్శబ్దంలో వికసించిన ఒక రాగమాలిక.

లక్ష్యం ఎంతో దూరం కాదు, ఐనా దళారులు
మా వీపుమీది బరువును చూచి బేరాలు
తమ రిక్షాలు పై కుంఠ మార్గాల ఎగిరే సువర్ణ పక్షులు.

ఈ యంత్రాలు- తంత్రాలు-
దారిని దూరంగా
మా బరువును మోయలేని భారంగా
అగమ్యంగా, దుస్సహంగా చూపినయ్.

ఎదురుగా పూల అంగడి, కోరికల సంగడి
ఆ చంద్రచాంద్రీరుచి వెదజల్లే పుష్పలావికల కళ్లు
అమోఘ అనుభవాన్ని త్రావి మత్తెక్కిన పూల ఇంద్రచాపాలు
ఎంత ఆకర్షణ- ఇదీ ఈశ్వర పూజా ద్రవ్యమే.

అదిగో ఈ రోడ్డుమీద కదలే అడుగుల పడగలు
విరజానదిపై పొరలాడే తరంగాలు
ఇదిగో ఈ బాటలో వినబడే సన్నని సవ్వడి
మహతి తంత్రులను స్పృశించే చిరుగాలి.

అడుగడుగునా తడబడుతూ మబ్బులపై జారినట్లు
దారి పడవలో తెరచాపగా మా ఔత్సుక్యం
అక్కడక్కడా నవ్వుతూన్న కొన్ని బోర్డులు
అక్కడక్కడా వెక్కిరించే కొన్ని కళ్ల జతలు.

ఓహో ఈ దారిలో ఎక్కడైనా తప్పిపోవచ్చు
ఎన్నో అద్భుతాలు, ప్రలోభాలు, ప్రమోహాలు
ఈ చిత్రదర్శనం ఎంతటి మయసభ
ఎక్కడికక్కడే తాను ముని, పరమహంస, విభూతి.

పరిచ్ఛిన్నమైన సత్యానికి ఎంత వెకిలితనం
హిరణ్మయమైన ఆ తెర కనిపించనే లేదు
ఓసి తరంగమా, జలమృదంగమా, మాయాకురంగమా
నిన్ను చూచాను, దాటుతున్నాను, గుడ్‌బై.

మంచును కోసేవాడూ, చీకటిని కాలరాచేవాడూ,
లోతుల్లోని పగవాళ్లను పొదుల్లోంచి పెకల్చేవాడూ,
కృతఘ్నులను రూపుమాపేవాడూ
ఆకాశం ఒకేసారి ఫక్కున నవ్వినట్లు
అదే సహస్రార చక్రంలా సూర్యుడు.

సూర్యుడితోపాటు మేల్కొన్న పూలు ఎన్ని వేలు
తెల్లగా నవ్వుతూ కాళ్లపైనా సైకిళ్లపైనా—
తావి వీడని ఎనభై ఏళ్ల పూలు
నిండుదనం పండిన ఆరేళ్ల పూలు.

పూర్వం ఏ దేశమో, ఏ రంగో
ఏ లింగమో, ఏ మతమో ఈ సుమనోజాలానిది
ఇప్పుడు మూలాధారం ఒకటి అన్నిటికీ
ఒకే ఆనందగమ్యం, ఒకే అనంత సౌందర్యపథం
సొగసైన పుష్పయాత్ర ఈ బ్రతుకు.

ఈ పూలకు అతిథి మృత్యువు.
ఈ రేకులు విప్పేసి తొడుక్కుంటాయి
ఇంతకన్నా అందమైన బంగారు రేకుల్ని.

పరమశివుని నిత్య తాండవ ఫణితి ప్రకాశించి
క్షీరసాగరశాయి నిద్రి చెదరి వైష్ణవత భాసించి
ధ్వని వర్ణమై, స్వరమై, మంత్రమై
సంకల్పరేఖ ఇరుకొసల నిలచిన సురదైత్యమై
అనుక్రమించే దివారాత్ర భ్రమణమై—

గాయత్రి తన బంగారు రెక్కలు విచ్చి
ఆవరించి వినీల దురూహ్య గగనాన్ని
బిందువు భూమండలమై వికసించి
దిగంతాలను ముడివేచిన పంచదశి.

రోదసిలో వెలిగే చంద్రకాంత పీఠాన
రెండు రాజహంసలు, ఆనంద మీమాంసలు
రూపం పొందిన గంగా హిమాలయాలు
చైతన్యం ప్రకటించే ఆరోహణ అవరోహణలు
శూన్యానికీ అనంతానికి నడిమి రేఖలు.

మేల్కొన్న నాకు కల, కదుల్తూన్న నాకు కల
వరుసగా అరవర్తించే కల, ఇరువై మందికీ ఒకే కల.

ఇక్కడి లోకం అదో తీరు
ఎవడి గోల వాడిది
తమలో తామే 'మునిగానాం తేలానాం'

ఈ వీణలు దారువు వేరు, తంత్రులు వేరు
కాని ఒకే ఒక అదృశ్యహస్తం ప్రయోగిస్తున్నది
ఈ వేయి స్వరాలూ ఒకే రాగపు ప్రస్తారాలు.

సంవత్సరాల వాగులో బిందుబిందువుకీ నడుమ
ఏ హిరణ్యాక్షుడో చేరకుండా
సంధిలో నిలచివున్న రెండు రెండు కళ్లు.

ర్యాలి జగన్మోహినీ కేశవస్వామివంటి
ఒకే ఒక అచంచలచంచల ఇక్కడ సర్వసాక్షి.

జడ వస్తువులలో చైతన్య పరిమళం
ప్రతి కదలిక పురోగతి- మన ఉద్గతి
ప్రతి భావన క్రొత్త శ్రుతుల అన్వేషణ.

కనుదెరచి చూడు, నిత్యమైన ఈ జగత్తు
కను మూసిచూడు, సత్యమైన సంవిత్తు
రెండూ బింబ ప్రతిబింబాలు కావు
పరిణామ వివర్తాలు.

ఇక్కడ అందరూ వ్యక్తులుకారు ప్రతీకలు
రాబోయే సమష్టి చేతనా యుగానికి వార్తికాలు.

---

పాండిచ్చేరీ గీతాలు పన్నెండు

౬

ఈ సముద్రం శాంతంగా ఊరేగదు, ఎప్పుడూ ఉరుకులు
తృప్తి లేదు, ఎప్పుడూ తరగలెత్తి పరుగులెత్తడం.

పడగ విప్పిన పాముల్లాలేచి చేతుల్ని చుంబించుతూ
అగణ్య పత్రమైన పుండరీకపు అంచుల సౌందర్యం చూపి
ఊహల తెల్లని నురుగును పాదాల దగ్గర నిలిపి
ఈ సముద్ర తరంగాలు, సూర్యుణ్ణి తమలో పొదువుకుంటున్నవి.

ఈ నీటి హోరులో ఏడు సముద్రాల సంస్కృతుల గీతాలు
ఈ గాలి మ్రోతలో నిరంత మానవ చైతన్యగతి రహస్యాలు
ఆ చివర కలుసుకున్న ఆకాశమూ, భూమీ
నిగూఢ సృష్టి రహస్యాన్ని విప్పిచెప్పే ప్రణయగ్రంధి.

ఈ తరగల కళ్లలో ఎన్ని సజీవ స్వప్నాలు
ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో ఎంత బలమైన విశ్వాసం
సమష్టిగా జీవకోటి అనంతంవైపు ప్రయాణం
యుగాలుగా అభేద్యాలైన కవాటాలను భేదించడం.

ఇంత సేపు కదులుతూన్న క్షణాలు ఇక్కడ గడ్డకట్టినై
మనసు ఎదుటనే మేల్కొన్నది క్షీరసముద్ర ఖండం
నైశ్చల్యం పొంగినట్లు, అనాహతం మ్రోగినట్లు
అవ్యక్త భవిష్యజ్జీవనం అంతటా పొదుపుకున్నట్లు.

'గగనానికి ఇలకూ బహుదూరంబనినాడో' అను
త్యాగరాజు సంస్పందన రేఖా చిత్రమై నిల్చినట్లున్న నేను
ఈ చెట్టు క్రింద ఈ చంద్రకాంతోపలం మీద
ఒదిగిన నా నుదుట పాంచజన్యం కొస నొక్కినట్లు.

ఇంద్రియాల గొడుగు క్రింద నిలిచిన నాకు తోచింది
సరస్వతీదేవి మందహాసం తన్ను మలచుకొన్న జలేజంగా
సాధన దర్శనలనే రెండు కళ్లు తెరచుకొన్నట్లు
పికాసో బొమ్మలో అమ్మాయి పట్టుకున్న దీపం వెలిగినట్లు.

ఈ చుట్టూ అగణ్య నేత్రాలలో స్వర్ణ దృశ్యాలు
ఈ చుట్టూ నిమగ్న ఫాలాలలో చివురించే తృతీయ నేత్రాలు
పైన పరిభ్రమించే సుదర్శన చక్రం
చుట్టూ పరిక్రమించే సౌందర్యలహరి.

వినీల గగనం నడిబొడ్డున కౌస్తుభరత్నం వెలిగి
అఖండమైన కాలం రెండు చేతులు జోడించే వేళ

నిశ్శబ్దంగా కొనసాగుతూన్న కల్లోలాలు
చిరునవ్వుతో పలుకరించే ఏకాంతాన్ని చూచి
అశరీరంగా స్పందించే తపస్సేవధిని చూచి
సంకుచితమైన సత్యలోకం లిప్తైకదేశాన స్ఫురించి
ఒక అడుగు వెనుకవేసి సాష్టాంగ పడ్డవి.

ఇంత అల్పమైన స్థలం ఈశ్వరుడెన్నుకొన్న ప్రయోగశాల
దివ్యాదివ్య లోకాల సంగమ బిందువు, అభేద్య సేతువు
అద్భుతమైన సంకల్పం ఆ వాయువీధుల స్ఫురించి
అపూర్వమైన చైతన్యం అక్కడ మమ్మెల్ల ముంచెత్తి.

ఈ ఆనంద మధుకోశాన కనిపించని తుమ్మెద
అప్రతిహత ఝుంకారం వినిపిస్తోంది ఇప్పటికీ
అతిమృత్యువైన ఈ అనాహతనాదం నడుమ
సాక్షాత్కరించు ఛందోమయం ఋతంభర.

ఉదయించబోతూ తన కిరణాలను ప్రోగు చేసుకునే
సూర్యుణ్ణి చూడటం ఎలా ఉంటుంది ?
ఇక్కడ కళ్లు విప్పింది ఈశ్వరాభిముఖంగా కర్మ
జీవితమే యోగం, ప్రవృత్తి ఈశ్వరారాధన.

ఈ రాళ్లూ మట్టీ తమలో పొదువుకునే అపూర్వ అభివ్యక్తి
ఈ నిర్మాణాలలో కానవచ్చే రూపచైతన్య దీప్తి
సమష్టి సౌందర్యానుభవానికి తావుగా
పరిపూర్ణ జీవన కల్పనకు తొలినెలవుగా.

వివృత్తీ, నిర్వేదం చూడని విసర్గ చైతన్యం కదలి
దేనికది స్వయంభువుగా, దేనికది రూపొందిన అవ్యక్తభావంగా
మబ్బుతునకగా, వానచినుకుగా, వెన్నెల మొలకగా
అపూర్వమైన సిమెట్రీతో ఆకృతిని తాల్చబోతూ.

చేరనీ, చేరనీ నూరంచులనుండి రేఖలు కేంద్రానికి
రూపొందనీ మాతృమందిరం భూమండలమై చతుర్భుజాలతో
భావిలోకి తొంగిచూస్తున్నాను ఇది అయోధ్య, ఇది మిథిల
ఆగామి అతిమనస్సృష్టి కాహ్లాదడోలిక యిద్ది.

పరుగులెత్తి దిగివచ్చిన సూర్య రథాశ్వాలు
సైన్యంలా మార్చ్‌చేస్తూ ఉత్సాహ తరంగాలు
మిన్నంచులు తాకుతూన్న రెక్కలతోడి చంద్రికిరణాలు—
ఇక్కడ సాక్షాత్కరించు మానుషభావ సౌందర్యం.

మలచుకొన్న యింద్రియాల వాసనలతోడి దేహపీఠి
అతిమృత్యు చేతనావతార రంగస్థలి
శిరసెత్తిన ప్రాణశక్తి సంపూర్ణ విన్యాసం
విశ్వభావం కూర్చుకొన్న ఉన్నత గోపురం.

తను మన ఉన్మనస్సమష్టి సంపుటి
ఉద్గమించు అనూహ్య రాగానికి ఇది పునాది
ఉద్వేలమైన యౌవన సముద్రం నిబద్ధమై
శరీరపు అంచులను దాటలేక ఎగబ్రాకుతున్నది.

ఈ ద్వీపం నిండా జ్యోతిర్వృక్షాల పచ్చని కాంతులు
ఈ కోటమీద ఆసురీ శక్తులను చెండాడే సైనికులు
ఎక్కే కాలూ, నిచ్చెనా, ఆధారమైన భూమీ
ఉక్కువీ, వెండివీ, బంగారువీ అయితేనే
ఉన్నత భూమిక సాక్షాత్కృతి.

అర్ధ శతాబ్దం మాటల బంగారాన్ని మూర్తి కట్టించేందుకు
'సుషుప్తి' పొందిన భూతాల మధ్య 'మేల్కొన్నవాడి' శిల్పకౌశలం
భారతీయేతిహాసాల పరంపరకు ఆధునిక శిఖరం
త్రైకాలిక విశ్వచైతన్య వికాసం సంక్షిప్తీకరించిన మహావాక్యం.

వాస్తవికతా అతీతవాస్తవికతా రెండువైపులగల బంగారు నాణెం
వైఖరి పొందిన అపూర్వపరావాగావిష్కారం
ఆత్మహననోద్యుక్త వర్తమానానికి ప్రాణం నిలిపే దీపస్తంభం
దిక్కాల త్రివేణీ సంగమాన పొంగివచ్చిన సరస్వతి.

సప్తవ్యాహృతులూ సప్తస్వరాలైన ఉన్మనీ సంగీతం
సప్తర్షుల నడుమ వెలిగే అరుంధతీదేవి సుస్మితరేఖ
సవితృదీప్తి సాక్షాత్కరించిన మాలా మహామంత్రం
వ్యక్తావ్యక్త వాగ్దేవత చూపించిన విశ్వరూపం.

దక్షిణామూర్తి హస్తంలో వెలిగే వీణ
ఆయన 'సావిత్రి'
సత్యశివ శాంతముల త్రిపుటి—
అది సౌందర్యం.

నా వీపుమీద పెట్టె చిరిగి పోయింది
తరిగిపోయింది ఎన్నో మజిలీలనుంచి మోసుకువచ్చే బరువు
కరిగిపోయారు నా చుట్టూ ఉన్నవారు నా కళ్లల్లో.

రుక్మిణితో జగన్నాథుడు తిరిగి కుండినకు వెళుతున్నట్లు
కిరణాలను వెంబడించి సూర్యజ్యోతి పృథ్వికి దిగివచ్చినట్లు
చిత్తమూ, అహంకారమూ, మనస్సూ, బుద్ధీ నాల్గు స్తంభాలై
పైన కట్టే దేవాలయం శిఖరం ఒకసారి స్ఫురించినట్లు.

కాషాయాలూ, కమండలాలూ, గడ్డాలూ, ఉపన్యాసాలులేని
ఆధునిక వశిష్ఠాశ్రమం కామధేనువును నాతో పంపినట్లు
అననుభూతమైన ఒక ఆకలి పుడమిని ఆవరించబోతున్నట్లు
అనిపించింది, రంగుల లోతుల్లో ఒకేఒక దృశ్యబీజం తోచింది.

రాత్రి పూర్వయామాన గాలిలో నిండిన సామగానం
నానా భావసంకులమైన నగరాన్ని దాటివచ్చే నాకు
అమలినంగా, అపస్వరరహితంగా వినబడింది
మనస్సు నుండి అతీత మనస్సుదాకా
ప్రణవం కట్టిన సంగీత నిశ్శ్రేణిక.

# వి వృ తి

గీతం ౧ :-

మానవ సమాజం చైతన్య పురోగతిలో ఒకానొక విశిష్టమైన స్థానం చేరుకోవడం జరిగింది. అయినా ఆశించిన ఉన్నతమైన దివ్య స్థాయి- ఉషఃకాలం జరుగలేదు. "అది దేవతలు మేల్కొనేందుకు ముందరి గడియ". హంసలు ఉన్నత చేతన అవరోహణానికీ, సంపెంగలు భూమచేతన అధిరోహణానికీ ప్రతీకలు.

ఆధ్యాత్మిక యాత్రలో ఎందరో అడ్డు తగిలేవారు. మతాలపేర, మంత్రాలపేర, ఆచారాలపేర ఎవరికి వారిదే గొప్ప మార్గమనే ప్రచారం.

భౌతికమైన జగత్తునించి పారిపోనక్కరలేదు. చూడగలిగితే అది సౌందర్యమయంగా భాసిస్తుంది. అయినా ఈ సమగ్ర దివ్య జీవనంలో అదీ ఒక భాగమే కావాలి.

గీతం :- ౨

దారి సుషుమ్న- పడగ కుండలినీ శక్తికి సూచనలు. సాధనలో మోహపెట్టే అంశాలు నిరుత్సాహపరిచే అసురీ శక్తులు ఎన్నో. ఇవి ఎన్నో విధాలుగా సాధకుణ్ణి భ్రాంతికి లోనుజేసి తికమక పెడతై. కొన్ని అల్ప దేవతలు- భూమికి దగ్గరి అంతస్తులలో ఉండే శక్తులు- సులభంగా ప్రసన్నమై- అల్పసిద్ధులు కలిగిస్తవి. దానితో సంతృప్తి చెంది సిద్ధి పొందినట్టుగా భావించేవారు ఎందరో. అక్కడ 'అహం' భావం పెరిగి తానే ఈశ్వరుని 'విభూతి'ననేదాకా పోవడం ఉంది. మనోభూమికదాకా మనకు సత్యంగా భాసించే సత్యం ఆత్యంతికమైంది కాకపోవడం వలన ఈ మోహం కలుగుతుంది.

ఉన్మనీ భూమికలోని ఆత్యంతిక సత్యం మనకు గోచరించదు. 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం'.

గీతం :- ౩

సూర్యుడు ఉన్మనీ చైతన్యానికి ప్రతీక. ఇక్కడ శ్రీ అరవిందులను కూడా సూచిస్తుంది ఈ ప్రతీక. 'తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః'.

సాధకులు జీవనాన్నే యోగంగా భావించడంచేత దుఃఖానికీ, అలసటకూ దూరంగా పరిపూర్ణతకు దగ్గరగా ఉన్నారు. ఈ సాధకులు అనేక దేశాలనుంచి వచ్చినవారు. వికసించడం, పరిమళించడం, ఈశ్వరార్పణ కావడం పుష్పయాత్ర లక్షణం.

సాధకులు దివ్యజీవన పరిణామానికి సిద్ధంగా ఉన్నారు.

గీతం :- ౪

శివతాండవము, విష్ణువు ప్రవృత్తి సృష్టిలీలకు చిహ్నాములు. అక్కడ సృష్టి ఆకాశం నుండి ఆరంభమవుతున్నది. ధ్వని పుడుతున్నది. ఉన్నత పరిణామంలో ఇది మంత్రముగా రూపొందుతుంది. సృష్టికి సంకల్పం కారణం. ఒకే సంకల్పంవల్ల దేవతల నుండి దైత్యులదాకా ఉన్న అన్ని దశల జీవులూ కలుగుతున్నారు.

ద్యావాపృథ్వులు- పురుషుడూ, ప్రకృతీ- శివశక్తులూ- అరవిందుడూ, మాతృశ్రీ- వీరికి గాయత్రీ, పంచదశీ ప్రతీకలు. గాయత్రి మంత్రమే గరుత్మంతుడు: పంచదశి దేవీ మంత్రము.

గీతం :- ౫

అరవిందాశ్రమంలోని సాధకుల ప్రవృత్తిని చెప్పేగీతం. ఎంత సాధనలోనూ ఏ క్షణమైనా పడిపోవడానికి కారణం కావచ్చు. ఇక్కడ మాత్రరవిందుల అనుగ్రహం సాధకులను ఆపదల నుండి రక్షిస్తుంది. ర్యాలిలో ఒకే మూర్తికి రెండు వైపుల జగన్మోహిని, కేశవస్వామి మూర్తులు చెక్కబడి వున్నవి.

గీతం :- ౬

సముద్ర వర్ణన. ఇది అక్కడ బ్రతుకు పద్ధతికీ, లక్ష్యానికీ

గుర్తు. భాషా, ప్రాంత భేదాలకు అతీతంగా జగత్కుటుంబం ఒకే చోట చేరడం ఒక విలక్షణమైన సన్నివేశం. సాధన లక్ష్యం- 'మోక్ష ద్వారకవాట పాటనకరీ'- అట్టిది.

గీతం :- ౭

ఈ గీతం మాత్రరవిందుల సమాధి దగ్గర కలిగిన అనుభూతిని చెప్పేది. "గగనానికి ఇలకూ..." త్యాగరాజు "నగుమోము..." అన్న కీర్తనలోనిది. జగత్ప్రసిద్ధమైన పికాసో బొమ్మ "గుయెర్నికా" ప్రపంచ యుద్ధ బీభత్సాన్ని చిత్రించేది. దాన్లో బ్రతుక్కీ. భవిష్యత్తుకీ ఆశాచిహ్నంగా ఒక అమ్మాయి ఒక దీపం పట్టుకున్నట్లు చిత్రింపబడ్డది. సుదర్శనచక్రం ఈశ్వర చైతన్య నిత్య పరిక్రమణకు, సౌందర్యలహరి జగన్మాత ప్రవృత్తికీ గుర్తులు.

గీతం :- ౮

మధ్యాహ్నం పన్నెండు గంటల వేళ సరిగా శ్రీ అరవిందులు ఏకాంతంగా సాధన కొనసాగించిన గదిని దర్శించడం జరిగింది. "కల్లోలాలు" చూడటానికి వెళ్లిన వారి మనోలక్షణం తెలుపుతుంది. పార్థివ శరీరం విడిచినా అదృశ్యంగా ఇప్పటికీ శ్రీ అరవిందులు సాధకులకు సూచనలు ఇస్తున్నారనే విశ్వాసం. జగత్తును దివ్య పరిణామం వైపు వారు అదృశ్యంగానే తీసుకువెడుతున్నారనే నమ్మకం. ఋతము- ఉన్మనీ దశలోని ఆత్యంతికమైన సత్యము. ఋతంభర ఒకానొక ఉన్నతమైన యోగభూమిక.

గీతం :- ౯

పాండిచ్చేరీ సమీపాన మాతృశ్రీ సంకల్పించిన నూతన అంతర్జాతీయ నగరం "ఆరోవిల్" గూర్చిన రచన. శ్రీ అరవిందుల యోగ లక్ష్యం ఆయన దర్శించిన నూతన సమాజావిష్కారానికి అనువైన స్థలము యిక్కడ లభిస్తున్నది. ఇక్కడి నిర్మాణాలు అపూర్వ శిల్ప సమన్వితాలై ఉన్నవి.

గీతం :- ౧౦

ఆశ్రమ సమష్టిలో భౌతికచేతనను దివ్యచేతోవతరణానికి అను గుణంగా తీర్చిదిద్దే ప్రయత్నం చాలా గొప్పది. శరీరాన్ని దృఢంగా తీర్చిదిద్దడం యిక్కడి ప్రత్యేకత. "దేహో దేవాలయ ప్రోక్తః" అన్నమాట యిక్కడ సార్థకం అవుతున్నది. ఆశ్రమవాసులు వ్యాయామక్రీడలు నెరపేప్పుడు చూడవలసిందే. శమదమసాధన సులభ సాధ్యమౌతూవున్నది. ఉక్కు శరీరము- వెండిలా తళతళలాడే మనస్సూ- వ్యష్టి ఆత్మ బంగారమునకు సూచనలు.

గీతం :- ౧౧

శ్రీ అరవిందుల మహాకావ్యం సావిత్రిని గూర్చిన గీతం. "ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః" అన్నట్లు సమస్త సమాజానికంటే ముందే జాగరూకులై అతిమనోలోకాలను ఆవాహన చేసినవారు ఆయన. ఇది కేవలం కథకాదు. ప్రతీకకూడా జగచ్చైతన్య పరిణామంయొక్క త్రైకాలికవృత్తం చెప్పబడ్డది. అశ్వపతి తపస్సు శ్రీ అరవిందుల సాధనయేననీ, సావిత్రి మాతృశ్రీయేనని విజ్ఞులు చెప్పుతారు.

దక్షిణామూర్తి రూపాలలో వీణాదక్షిణామూర్తి ఒకమూర్తి.

గీతం :- ౧౨

సాధకుడు వ్యష్టి చైతన్యం నుంచి సమష్టిచేతనకు పురోగమించాడు. రుక్మిణీదేవి చైతన్యానికీ, కుండిన భూమికీ ప్రతీకలు. ఇది చైతన్య అవరోహణ. దేవాలయ శిఖరం విజ్ఞానమయ భూమిక. కామధేనువు విలక్షణమైన ఆధ్యాత్మిక అనుభూతికి సూచన. గీతం చివరి అమలినము, అపస్వరరహితమైన సంగీతము తొలి గీతాలలోవి కల్లోలానికీ భిన్నంగా కలిగిన మార్పును సూచిస్తుంది.